శ్లో॥ కపిలాఘృత సంయుక్తః- కృష్ణాగురు సముద్భవః
మయా సమర్పితో ధూపో- హనుమ ప్రతిగృహ్యతామ్॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః ధూపమాఘ్రాపయామి,

శ్లో॥ నిర స్తాజ్ఞాన తిమిర- తేజోరాశే! జగత్పతే!
దీపం గృహాణ దేవేశ! గోఘృతాక్తం దశాన్వితమ్॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః దీపం దర్శయామి.

శ్లో॥ ఇదం దివ్యాన్న మమృతం- సూప శాక ఫలాన్వితం
సాజ్యం సదధి సక్షీరం- శర్కరా మధు సంయుతమ్॥
భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ- చోష్యం చాపి చతుర్విధం
గృహాణ హనుమ న్భక్త్యా- స్వర్ణపాత్రే నివేదితమ్॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః మహానైవేద్యం
సమర్పయామి,

శ్లో॥ సమర్పయామి పానీయం- మధ్యే మధ్యే సుధోపమం
సచ్చిదానంద రూపాయ- సృష్టి స్థి త్యంత హేతవే॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః మధ్యే మధ్యే పానీయం
సమర్పయామి.

శ్లో॥ పూగీఫలై స్సమాయుక్తం- కర్పూరాది సమన్వితం
స్వర్ణవర్ణ దళోపేతం- తాంబూలం గృహ్యతాం హరే!
శ్రీ సువర్చలాసమేత హనుమతేనమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ నీరాజన మిదం దివ్యం- మంగళార్థం కపిప్రభో!
మయా సమర్పితం తాత! గృహాణ వరదో భవ॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః ఆనంద కర్పూర
నీరాజనం సమర్పయామి.

శ్లో॥ నృత్యం గీతం చ వాద్యం చ- కృతం గంధర్వసత్తమైః
ప్రకల్పయామి మనసా- రామదూతాయ తే నమః॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః నృత్యగీతవాద్యాని సమర్పయామి.

శ్లో॥ రాజోపచారై స్సతతం- పురాణపఠనాదిభిః
సంతుష్టో భవ సర్వాత్మన్- సర్వలింగమయాత్మక॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః రాజోపచారాన్ దేవోపచారాన్ సమర్పయామి

శ్లో॥ మైరావణ మహాదైత్య- ప్రాణవాయుబిలే శయ
పున రర్ఘ్యం ప్రదాస్యామి- పవనాత్మజ గృహ్యతామ్॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః పునరర్ఘ్యం సమర్పయామి.

## మంత్రపుష్పము

ఓం ధాతా పురాస్తాద్య ముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా అయనాయ విద్యతే సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్॥ విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్‌ం హరిః విశ్వమేవేదం పురుష స్తద్విశ్వముపజీవతి పతిం విశ్వస్యాత్మేశ్వరగ్‌ం శాశ్వతగ్‌ం శివమచ్యుతమ్ నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః నారాయణ పరం బ్రహ్మ తత్వం నారాయణః పరః నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః॥ యచ్చకించి జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా అ న్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః॥ అన న్తమవ్యయం కవిగ్‌ం సముద్రే న్తం విశ్వశంభువం పద్మకోశ ప్రతీకాశగ్‌ం హృదయం చాప్యధోముఖమ్॥ అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి జ్వాలా

మాలా కులంభాతి విశ్వాస్యాఽఽయతనం మహత్॥ సన్తతగ్ం శిలాభిస్తు లంబత్యా కోశసన్నిభం తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః సోఽగ్రభుగ్వి భజన్తిష్ఠ న్నాహారమజరః కవిః తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా సన్తాపయతి స్వం దేహ మాపాదతల మస్తకః తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా నీవార శూక వత్తన్వీ పీతాభాస్వ త్యణూపమా తస్యా శ్శిఖాయామ ధ్యే పరమాత్మా వ్యవస్థితః సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్. రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే నమోవయం వైశ్రవ ణాయ కుర్మహే సమేకామాన్ కామకామాయ మహ్యం కామేశ్వరోవై శ్రవణో దదాతు కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయనమః ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా ఓం తత్సత్యం ఓంతత్సర్వం ఓం తత్పురోర్నమః అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు త్వం యజ్ఞస్త్వం వషట్కార స్త్వ మింద్ర స్త్వగ్ం రుద్ర స్త్వం బ్రహ్మా త్వం ప్రజాపతిః॥ త్వం తదాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోమ్॥ అథైతం విష్ణవే చరుర్నిర్వపతి యజ్ఞో వై విష్ణుః యజ్ఞ ఏవాన్ తతః ప్రతితిష్ఠతిసోఽత్రజు హోతి_ విష్ణవేస్వాహా యజ్ఞాయస్వాహా ప్రతిష్ఠాయైస్వాహేతి వక్రతుండాయవిద్మహే శూర్పకర్ణాయధీమహి తన్నో గణపతిః ప్రచోదయాత్ నారాయణాయవిద్మహే వాసుదేవాయధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్ తన్మహేశాయవిద్మహే వాగ్విశుద్ధాయధీమహి తన్నశ్శివః ప్రచోదయాత్ దాశరథాయవిద్మహే సీతావల్లభాయ ధీమహి తన్నో రామచంద్రః ప్రచోదయాత్ ఆంజనేయాయవిద్మహే వాయు పుత్రాయధీమహి తన్నో హనుమాన్ ప్రచోదయాత్ ఈశాన సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్।

శ్రీ సీతాసమేత శ్రీ రామచంద్ర పాదసేవా ధురంధరాయనమః
సువర్ణ దివ్యమంత్ర పుష్పం సమర్పయామి

(చేతిలో నుంచుకొనిన అక్షతలు పుష్పములు శ్రీ హనుమంతుని పాదములం దుంచవలెను)

యానికానిచ పాపాని-జన్మాంతర కృతానిచ తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే॥

(అనుచు తనచుట్టు తాను ముమ్మారు తిరుగవలెను)

పాపోఽహం పాపకర్మాఽహం- పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవ!- శరణాగతవత్సల। అన్యథా శరణం నాస్తి- త్వమేవ శరణం మమ తస్మా త్కారుణ్యభావేన- రక్షరక్షాంజనాసుత॥

శ్లో॥ మందార పారిజాతాది- పుష్పాంజలి మిమం ప్రభో।
స్వర్ణపుష్ప సమాకీర్ణం- ఉష్ట్రధ్వజ గృహాణవై॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః సువర్ణదివ్యమంత్ర
పుష్పం సమర్పయామి.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారాన్- సాష్టాంగాన్ పంచసంఖ్యయా।
దాస్యామి కపినాథాయ- గృహాణాభీష్టదాయక॥
శ్రీ సువర్చలా సమేత హనుమతేనమః ప్రదక్షిణ నమస్కారాన్
సమర్పయామి.

శ్లో॥ దేవదేవ జగన్నాథ- పురాణపురుషోత్తమః
అనేన పూజావిధినా-సుప్రీతో భవ సర్వదా॥
సువర్చలాసమేత స్త్వం- చతురావరణాన్వితం

హంసతూలికయోపేతే- మమ హృత్పంకజే వస॥
అనయాధ్యానా వాహనాది షోడశోపచారపూజయా భగవాన్సర్వాత్మకః
శ్రీ సువర్చలా హనుమాన్ సుప్రీతో సుప్రసన్నో వరదోభవతు.

శ్లో॥ నమస్తేఽస్తు మహావీర!- నమస్తే వాయునందన!
విలోక్య కృపయా నిత్యం-త్రాహి మాం భక్తవత్సల!
ఐదుమార్లు నమస్కారము చేయవలయును.

## తోరగ్రహణమ్

శ్లో॥ యే పుత్ర పౌత్రాది సమస్త భాగ్యం
వాంఛంతి వాయో స్తనయం ప్రపూజ్య
త్రయోదశ గ్రంథియుతం తదంకం
బధ్నంతి హస్తే వర తోరసూత్రమ్॥

ధారణము: అంజనాగర్భ సంభూత- రామకార్యార్థ సంభవ!
వర తోరకృతాభాసః రక్ష మాం ప్రతివత్సరమ్॥
అని మంత్రము జపించుచు ధర్మపత్నితోబాటు తోరము ధరింపవలెను.
వెనుకటి తోరమును విప్పి జనులు త్రొక్కనిచోట వేయవలెను.

# శ్రీ హనుమద్వ్రత కథా

## ప్రథమోఽధ్యాయః

శ్లో॥ మునయో జాహ్నవీతీరే- శౌనకాద్యా ద్విజోత్తమాః
ప్రణమ్య జగతాం నాథం- రమానాథం ముహుర్ముహుః॥
సూతం పురాణవక్తారం- మహాభాగవతోత్తమం
దృష్ట్వా ప్రాంజలయ స్సర్వే- ప్రోచు ర్వ్రతపరాయణాః

తా॥ పూర్వము శౌనకాది మహామునులు గంగాతీరమందున్నవారై జగన్నాధుడు, లక్ష్మీపతియైన విష్ణువునకు నమస్కరించి పరమ భాగవతోత్తముడు, పురాణ ప్రవచన మొనర్చువాడు అగు సూతుని చూచి అందఱు నమస్కరించి వ్రతపరాయణులై ఇట్లు పల్కిరి.

శ్లో॥ వాసుదేవ కథాప్రశ్నే – వ్రతాని బహుశ స్త్వయా
ప్రోక్తాని కృపయా ఽస్మాకం – వ్రత మన్య ద్వదస్వ నః

తా॥ ఓ సూతమహామునీ ! విష్ణుగాథను వివరించుచు నీవు మాకనేక వ్రతములను చెప్పితివి. అట్లే మాకిప్పుడు మఱొక్క వ్రతమును గూర్చి చెప్పవలసినది.

సూత ఉవాచ

శ్లో॥ శృణుధ్వ మృషయ స్సర్వే – మ త్తః పరతరం వ్రతం
చతుర్ణా మపి వర్ణానాం – కర్తవ్యం పావనో త్తమం
గృహ్య ద్గుహ్యతమం లోకే మంగళానాం చ మంగళం
ఆయురారోగ్య ఫలదం – పుత్ర పౌత్ర ఫలప్రదమ్॥
సంపత్కరం ప్రతిదినం విద్యాప్రద మను త్తమమ్॥

తా। సూతమహాముని ఇట్లనిరి: ఓ మునులారా! పరమ పవిత్రమైనది నాల్గు వర్ణములవారు అనుష్ఠింపదగినది, అతి రహస్యమైనది లోకమందు గొప్పమంగళ ప్రదమైనది ఆయురారోగ్య భోగభాగ్యములను, పుత్రపౌత్రులను కల్గించునది విద్యాప్రదానమైనదియగు శ్రేష్ఠమైన వ్రతమును చెప్పెదను వినుడు.

శ్లో॥ కదాచి ద్భగవాన్ వ్యాసః – సహశిష్యై ర్దయానిధిః
యుధిష్ఠిరం ద్వైతవనే – ద్రష్టు మభ్యాగతో హఠాత్॥

తా॥ ఒకప్పుడు దయాపూర్ణుడగు వ్యాసభగవానుడు తన శిష్యులతో కూడి ద్వైతవనమునకు ధర్మరాజును చూచుటకై హఠాత్తుగా వచ్చెను.

శ్లో॥ సపంచమ పికాకీర్ణం – సషడ్జ శిఖిసంకులం
శ్రుతాధ్యయన సంపన్నైః – యజ్వభిః బహువేదిభిః॥
పుత్రైః పౌత్రైః పరివృతైః – కలితం లలితం తతం
శాస్త్రవ్యాఖ్యాన చతురైః – వేదఘోషోపశోభితమ్॥
మహాభాగవతోద్గీత – లీలా హరికథాశ్రయం
నిత్యాన్నదాన నిలయం – శ్రేష్ఠం సర్వాశ్రమేషు చ॥

తా॥ ఆద్వైతవనము పంచమస్వరంకల కోకిలలతోను, షడ్జస్వరము పలుకు నెమళ్ళతోను మిక్కిలి కూడియున్నది. బాగుగ తెలిసి వేదముల నధ్యయన మొనర్చెడి అనేకమంది వేదజ్ఞులతోను, వారి పుత్రపౌత్ర గణముతోను కూడి మనోహరమైనది. శాస్త్ర వ్యాఖ్యానముల తోను, వేద ఘోషతోను కూడియున్నది. మహాభాగవత గానముచే హరికథా నిలయమైనది. నిత్యము అన్నదానము జరుగునట్టిది, ఆశ్రమము లన్నిటియందు శ్రేష్ఠమైనదియును.

శ్లో॥ సానుజం సకళత్రం చ – తత్రాపశ్య ద్యుధిష్ఠిరమ్

తా॥ తమ్ములతోను భార్యతోను కూడియున్న ధర్మరాజు నటచూచెను

శ్లో॥ కృష్ణద్వైపాయనం సోఽపి – శ్రుత్వా ఽ భ్యాగత మాదరాత్
అతిదూరం చ నిష్క్రమ్య – పురస్కృత్య సహానుజైః
ఏకాన్త సదనం నీత్వా – నివిష్టం పర్యపూజయత్

తా॥ ఆ ధర్మరాజుకూడ వ్యాసభగవానుడు వచ్చుచున్నాడని విన్న వెంటనే చాలదూరము సోదరులతోబాటు ఎదురేగి తోడ్కొనివచ్చి ప్రశాంతమగు గృహమున కూర్చుండబెట్టి సేవలొనర్చెను.

శ్లో॥ ద్రౌపదీరచితాం పూజా – మురరీకృత్య సద్విజైః
సాదరం కుశలం ధర్మం – పప్రచ్ఛేంద్రం యథా గురుః॥

తా॥ ఆ వేదవ్యాసుడు ద్రౌపదిచేసిన సేవలకు సంతసించి బృహస్పతి దేవేంద్రుని క్షేమవిచారముచేసినట్లు ధర్మరాజుయొక్క యోగక్షేమము లడిగెను.

వేదవ్యాస ఉవాచ -

శ్లో॥ భద్రం ఖలు మహారాజ ! కుశలం ఖలు పార్థివ !
అస్తే ఖలు మహావీర స్సుఖమేవ వృకోదరః॥
ధనంజయ స్సుఖీ చైవ - యయా చ సుఖినా వుభౌ
సంపాదితం పాశుపతం - దివ మస్త్రం కిరీటినా

తా॥ వేదవ్యాస మహాముని ఇట్లడిగెను. ఓ మహారాజా ! ధర్మజా క్షేమముకదా, మహావీరుడైన భీముడు సుఖముగా నున్నాడుకదా ! అర్జునుడు, నకుల సహదేవులును క్షేమముకదా ? అర్జునుడు పాశుపత మహాస్త్రమును సంపాదించెనుకదా ! అని యడిగి యనంతరము

శ్లో॥ అన్య ద్గుహ్య ద్గుహ్యతమం - వదత శ్శృణు త న్మమ
అస్తి వ్రతం మహారాజ - కేవలం సాంప్రదాయికమ్
కృతే తస్మి న్వ్రతే శీఘ్రం - భవ ద్రాజ్యగమో భవేత్॥

తా॥ ఓ ధర్మరాజా! సంప్రదాయబద్ధమై మిక్కిలి రహస్యమైన వ్రత మొకటి కలదు చెప్పెదను వినుము. ఆ వ్రతము నాచరించినచో నీకు త్వరగా మరల నీ రాజ్యము లభించును.

ధర్మపుత్ర ఉవాచ :

శ్లో॥ కిన్నామ వ్రత మాహాత్మ్య - మైశ్వర్యం తస్య కీదృశం
దేవతా తత్ర కా ప్రోక్తా - కో విధిః పూజనం కథం?
కస్మి న్కాలే చ కైః పూర్వం - వ్రత మాచరితం ప్రభో!

తా॥ అనగా ధర్మరా జిట్లడిగెను. ఓ మహామునీ! ఆ వ్రతము పేరేమి? ఆ వ్రతమాహాత్మ్య వైభవము లెట్టివి? ఆ వ్రతమునకు దేవత

ఎవ్వరు? ఏ మాసమునందు దాని నాచరింప నగును? పూర్వ మెవ్వరా వ్రత మాచరించిరి? చెప్పవలసినది.

శ్లో॥ ఇదానీ మేవ త త్కార్యం- యది శీఘ్రఫలప్రదం
ఇత్థం త వాతిదుఃఖార్తే- కృపా చే న్మయి సానుజే॥
భవాదృశానాం మహతాం- బాన్ధవో మమ నాపరః
యుధిష్ఠిరేణ స ముని- స్సవిశ్వాస ముదీరితః॥

తా॥ ఆ వ్రతము వెంటనే ఫలితమిచ్చునదైనచో ఇప్పుడే ఆచరింతును. ఓ మహానుభావా! సహోదరులతో కూడి దుఃఖితుడనై యున్న నా యందిట్టి ఆదరముకల మీకంటె నాకు వేరు బంధువులు లేరు. అని ఈ రీతిగా ధర్మరాజు వ్యాసునియందు గౌరవముతో పల్కెను.

శ్లో॥ ప్రత్యువాచ స్మరన్ చిత్తే- హనుమంతం ముహుర్ముహుః

తా॥ అంతట వ్యాసుడు హనుమంతుని మనస్సున పలుమార్లు స్మరించుచు ఇట్లు చెప్పదొడగెను.

వేదవ్యాస ఉవాచ :

శ్లో॥ శ్రుణు రాజేంద్ర। తన్నామ- హనుమద్వ్రత మద్భుతం
ఉచ్చారణా దేవ తస్య- కార్యసిద్ధి ర్న సంశయః॥

తా॥ ఓ రాజశ్రేష్ఠా! అద్భుతమగు ఆ వ్రతము హనుమద్వ్రతము. దాని నుచ్చరించుటచేతనే నిస్సందేహముగా కార్యసిద్ధి యగును.

శ్లో॥ దుష్టగ్రహోచ్చాటనం చ- మహాజ్వర నివారణం
అలం హి బహుభి ర్వాక్యై- రభీష్టద మితి స్మృతమ్॥

తా॥ ఆ వ్రతము దుష్టగ్రహములను పారద్రోలునది, మహా జ్వరములను కూడ పోగొట్టునది. పెక్కు మాటలేల? కోరిన కోర్కెలన్నిటి నిచ్చునదిగా తెలియబడుచున్నది.

శ్లో॥ పురా హి భగవాన్ కృష్ణః- పాంచాల్యా ప్రార్థితో భృశం
అచచక్షే వ్రత మిదం- సవిశేషం హనూమతః
తత్ప్రభావాదేవ లబ్ధా స్తయా పరమసంపదః॥

తా॥ పూర్వము శ్రీకృష్ణభగవానుని ద్రౌపది ప్రార్థించుటవలన ఈ విశిష్టమగు హనుమద్వ్రతము నామెకు తెల్పెను. దాని ప్రభావముననే మున్ను మీకు సర్వసంపదలు లభించినవి.

శ్లో॥ కదాచి దపి పాంచాల్యాః- కంఠస్థం వ్రతతోరకం
దృష్ట్వా ధనంజయః ప్రాహ- కి మేత ద్ధృత మిత్యలమ్॥

తా॥ ఒకప్పుడు ఆ ద్రౌపది కంఠమునందు ఉన్న హనుమద్వ్రత తోరమును చూచి అర్జునుడు ఏమిటి దీనిని ధరించితివని యడిగెను.

శ్లో॥ సాచచక్షే సుమధురం- వ్రతాగమన ముత్తమం
శ్రుత్వైతత్ దైవవశగః- పార్థః క్రోధసమన్వితః
ప్రాహ వై పౌరుషం వాక్యం- ముచ్చైశ్వ ర్యాతిగర్వితః॥

తా॥ ద్రౌపది సుమధురము ఉత్తమమైన హనుమద్వ్రతమును గూర్చి తెల్పెను. ఆమాట విని విధివశమున కోపపూర్ణుడై ఐశ్వర్య గర్వమున పౌరుషముగ నిట్లు పల్కెను.

శ్లో॥ ధ్వజే మమ నిబద్ధోఽ యం- వానరో నితరం మయా
కిం దాస్యతి మమ బ్రూహి- వటు ర్వన్యాశనో మృగః॥
తిర్యగ్జన్మా పరాధీనో- యోషితో బుద్ధి రీదృశీ
ఏతాదృశై ర్వ్రతై రస్మా న్న వంచయితు మర్హసి॥

తా॥ నాజెండాపై కట్టుబడి యుండువాడు, వానరుడు, బ్రహ్మచారి, ఆకులలములు తిని బ్రతుకువాడు, మృగజాతివాడు, పరాధీన వర్తనుడు అయిన ఆ హనుమంతుడేమి ఈయగలడు? మీ స్త్రీజాతి బుద్ధి ఇంతియే. ఇటువంటి వ్రతములతో మమ్ముల మోసగించుచున్నావు.

శ్లో॥ ఇత్యుక్తా సాపి దుఃఖార్తా ప్రాహ తథ్యం ధనంజయం
భో రాజన్ వాసుదేవేన- మమాఖ్యాత మిదం వ్రతం
జగన్నాథేన కృష్ణేన- తదాచర్య మయా ధృతమ్॥

తా॥ అనగా నామె దుఃఖించి అర్జునునితో నిట్లనెను. ఓ రాజేంద్రా! ఈ వ్రతము జగన్నాథుడైన శ్రీకృష్ణునిచేత నాకు చెప్పబడినది. ఆ మహానీయుడు వాసుదేవుడు చెప్పిన వ్రతము నాచరించి ఈతోరమును ధరించితిని.

శ్లో॥ దుశ్శీలే ఛద్మనా తుభ్యం- తేన హాస్యా త్సమీరితం
మ న్నిబద్ధస్య తస్యైవ- మదధీనస్య దాసవత్॥
పూజా తేన కథం ప్రోక్తా- దుష్టచిత్తేన విష్ణునా
పతివ్రతా న చ త్వం వై- పతివాక్యపరాయణా॥
త్యాజ్యం తత్తోరకం తే తు- వ్రతాంగం వ్రత మప్యుత॥

తా॥ అనగా అర్జునుడు కోపించి ఓదుశ్శీలా, నీకు పరిహాసముగా ఈ వ్రతము చెప్పెనేకాని నిజముకాదు: ఆ దుష్టచిత్తుడగు కృష్ణుడు నాకు బద్ధుడై దాసునివలె నాయధీనుడుగానున్న హనుమంతుని పూజ నీకెందుకు చెప్పెను? భర్తృవాక్యమును వినని నీవు పతివ్రతవు కావు. అదినీకు వ్రతమైనను, వ్రతాంగకమైనను ఆ తోరమును తీసివేయవలసినది.

శ్లో॥ ఇతీరి తేయం సంత్రస్తా- సతీత్వా త్పతిదేవతా
త్యక్త్వా తు తోరకం తత్ర- న్యస్త ముద్యాపనా త్పురా॥

తా॥ అని పలుకుటచే భయమందినదై పతియే దైవముగా కల పతివ్రత యగు ద్రౌపది వ్రతఉద్యాపనకు ముందే ఆ తోరము నచ్చట వీడెను.

శ్లో॥ తత స్సకలసంపత్తి- ర్యథాగత మగా త్తథా
భవద్భి రీదృశం ప్రాప్త- మాయాసా ద్వన సేవనమ్॥
త్రయోదశ గ్రంథియుక్త- తోర స్యోల్లంఘనేన వై
భోక్తవ్యం తత్ఫలం సమ్యక్- వత్సరై శ్చ త్రయోదశైః॥

తా॥ అందువలననే ఓ ధర్మరాజా! మీయొక్క సకల సంపదలు వచ్చిన రీతినే పోయినవి. మీకిట్టి వనవాస క్లేశము సంభవించినది. పదుమూడుముడులు కల తోరమును త్యజించినందుకు ఫలముగా పదుమూడేం డ్లిట్టి కష్టములనుభవింపవలసి యున్నది.

శ్లో॥ ఇ త్యేత త్సకలం శ్రుత్వా– కృష్ణా సస్మార తద్వ్రతం
సత్య మిత్యాహ సర్వేషాం– పతీనాం పురత స్తదా॥

తా॥ ఇది యంతయు విని ద్రౌపది ఆ వ్రతవిషయమును జ్ఞాపకము చేసికొని భర్తలందరి ఎదుట ఆ విషయము సత్యమని యప్పుడు చెప్పెను.

వ్యాస ఉవాచ–

శ్లో॥ అపరం శ్రోతు మిచ్ఛా చే– త్సేతిహాసం వదామి తే

తా॥ అంత వ్యాసుడు ఓ ధర్మరాజా! ఇంకను విననెంచినచో వేరొక గాథ చెప్పెదను వినుము.

శ్లో॥ పురా హి రాఘవ స్సీతాం – ద్రష్టుకామ స్సలక్ష్మణః
ఋష్యమూక ముపాగమ్య – హనూమంతం దదర్శహ॥
ససుగ్రీవేణ తేనాసౌ రామ స్సఖ్యం చకార హ॥

తా॥ పూర్వము శ్రీరాముడు లక్ష్మణునితో కూడినవాడై సీతను వెదకుచు ఋష్యమూకపర్వతముచేరి హనుమంతుని చూచిరి. అంత రాముడు సుగ్రీవునితోను హనుమంతునితోను స్నేహము చేసెను.

హనుమానువాచ

శ్లో॥ రామ రామ మహాబాహో – య ద్వక్ష్యే శ్రుణు తద్వచః
భక్త స్య తవ మే రామకార్యాతురవ చేరితమ్॥
అహం పురా మఘవతా వజ్రేణ హనుతాడితః
తదా ప్రభృతి ఖ్యాతోఽస్మి హనుమా నితి భూతలే॥

తా॥ అట హనుమంతుడు రామునితో నిట్లనెను. ఓ శ్రీరామచంద్రా నీ భక్తుడనైనట్టియు, రామకార్యమున ప్రవేశపెట్టబడినట్టియు నా మాటను వినుము. పూర్వము దేవేంద్రుడు వజ్రాయుధముతో నాదవుడను కొట్టెను. ఆనాటినుండి భూతలమున హనుమంతుడనని పేరుగాంచితిని.

శ్లో॥ తదా మాం మూర్ఛితం దృష్ట్వా - పితా మే వాయు రబ్రవీత్
యతో విపాతితః పుత్ర — ఇతి క్రుద్ధ స్తిరోదధే।

తా॥ అప్పుడు మూర్ఛనందిన నన్ను చూచి నా తండ్రియగు వాయుదేవుడు 'ఏల నాకుమారుడు పడగొట్టబడినా' డని కోపమువహించి వాయువు వీచకుండ తిరోగమించెను.

శ్లో॥ తదా బ్రహ్మదయో దేవా — స్త్వాశ్వేమ్యాయ వద న్తి వై

తా॥ ఆరీతిగా వాయువు లేక ప్రపంచము స్తంభించిపోవుటచే బ్రహ్మదిదేవతలు ప్రత్యక్షమై ఈ రీతిగా పల్కిరి.

శ్లో॥ ఆంజనేయ ! చిరంజీవ – త్వ మమేయ పరాక్రమః
అశేష రామకార్యాణి – సాధయ త్వం కపీశ్వర !॥
వాయుపుత్ర ! ప్లవంగేశ – హనుమద్వ్రత నాయకం
త ద్య శ్చకార విమలం – భృశం ప్రియతమాద్భుతమ్॥
తస్య సర్వాణి కార్యాణి – సిద్ధ్యంతీతి వరం దదుః॥

తా॥ ఓ అంజనేయా ! నీవు చిరంజీవివగుము. అంతులేని పరాక్రమము నంది రామకార్యములన్నింటిని నెరవేర్చుము. ఓ వానరేశ్వరా ! వాయుపుత్రా! హనుమద్వ్రతమును నాయకుడవైన నిన్ను గొప్పగా ప్రతిష్ఠించి ఎవరు పూజింతురో వారి సర్వకార్యములు నెరవేరును. అని వరమిచ్చిరి।

శ్లో॥ కార్యార్థినా రాఘవేణ – కృత్య మి త్యబ్రవీచ్చ మాం
స్మృతం త ద్వై రామః వాక్యం – కురు స్వామిన్ మయేరితమ్॥

న మంతవ్యం వృథా నాథ । సత్యం మంతవ్య మీదృశం
రోచతే యది త్వచ్చిత్తే - తత్కురు ష్వార్థసిద్ధయే।

తా॥ కార్యార్థియైన రాముడీవ్రతమును అచరింపదగినదనికూడ చెప్పెను. ఆ వాక్యములను ఇప్పుడు గుర్తు తెచ్చుకొనినాను, ఓ రామా। నీవామాటను తప్పక వినుము. వ్యర్థముగు ఆలోచన తగదు. దీనిని సత్యముగ నెంచుము. నీకు మనసున నచ్చినచో కార్యసిద్ధికై అ వ్రతము నాచరింపుము.

శ్లో॥ ఇత్యుక్త్వా సంస్థితే తస్మిన్ - తదా సంక్రమతే హఠాత్
ఆకాశవాణీ తత్రోచే - యదుక్తం సత్యమేవ తత్॥

తా॥ అని చెప్పి హనుమంతుడు మిన్నకుండగా ఇంతలో హఠాత్తుగా, ఆకాశవాణి 'ఈ చెప్పిన విషయము సత్యమే' అని పల్కెను.

శ్లో॥ ఇతి రామః ప్రసన్న శ్చ శ్రుత్వా గగనభాషితం
చికీర్షయా వ్రత స్యాస్య -హనుమన్త మథాబ్రవీత్॥

తా॥ అట్టి అకాశవాణిని విని రాముడు సంతసించి ఆవ్రతమాచరింప నెంచినవాడై హనుమంతునితో నిట్లు పల్కెను.

శ్లో హనుమ న్కో విధి స్తస్య , కదా కర్తవ్యమేవ తత్
బ్రూహీతి వచనం శ్రుత్వా - ప్రత్యువాచ మరుత్సుతః॥

తా॥ ఓ హనుమంతా। ఏ రకమైన విధి ఆ వ్రతమునకు కలదు? దాని నెప్పుడాచరింపవలెను? చెప్పుమనగా వాయునందనుడిట్లు చెప్పదొడగెను.

శ్లో మార్గశీర్షే సితే పక్షే - త్రయోదశ్యాం జయప్రదే
త్రయోదశ గ్రంధియుతం తోరకం కలశే స్థితమ్॥
హరిద్రాభం తత స్తత్ర మా మావాహ్య ప్రపూజయేత్॥
పీతగన్ధం పీతపుష్పం పీతద్రవ్యం విశేషతః॥

తా। మార్గశిరమాసమున శుక్లపక్షమున జయప్రదమగు త్రయోదశి యందు పదమూడు ముళ్ళుగల తోరమును పసుపురంగుదానిని కలశము నందుంచి పిదప నాశావాహన మొనర్చి పూజ గావింపవలెను, పసుపు పచ్చని గంధము పుష్పములు అట్టివే ద్రవ్యములు విశేషించి ముఖ్యము యినవి.

శ్లో॥ నమోభగవతేవాయునన్దనా యేతి మంత్రతః
ఓంకార పూర్వతః పూజాం కుర్యా త్షోడశ యత్నతః
సోపచారం బ్రాహ్మణాయ దద్యా ద్వాయన ముత్తమం
త్రయోద శాపూప మాత్రం గోధూమాన్నం ప్రదాపయేత్
సదక్షిణం సతాంబూలం బ్రాహ్మణా న్భోజయే త్తతః॥

తా॥ ఓం నమో భగవతే వాయునందనాయ అను మంత్రము నుచ్చరించుచునే పదమూడు ముళ్ళువేసి ఆ మంత్రముతోనే షోడశోపచార పూజ గావింపదగును. పిదప శ్రోత్రియుడగు నానికి ఉపచారములొనర్చి ఉత్తమ మగు వాయనమును పదమూడు అప్పములతో నీయవలెను. గోధూమాన్న మును సమర్పింపవలెను. దక్షిణతోకూడ తాంబూలము నర్పించుచు సదాచార సంపన్నులకు అన్నదానమొనర్చవలెను.

శ్లో॥ ప్రారంభే త్వస్య కార్యాణి - సిద్ధ్యంత్యేవ న సంశయః
తావ త్కర్తవ్య మేత ద్వై - యత్నతశ్చ త్రయోదశ॥

తా। ఈ వ్రత ప్రారంభమందే కోరికలు నెరవేరును. దీనిని ప్రయత్నపూర్వకముగా పదుమూడేడులు ఆచరింపనగును.

శ్లో॥ ఉద్యాపనం యథా న్యాయం — కుర్యా త్కలశవస్త్రకైః
సంపూర్ణ మితి చే త్యుక్త - మిత్యుక్త్వా విరరామహ॥

తా॥ దీని యుద్యాపనము పదుమూడు కలశములు, పదుమూడు వస్త్రములు, పదుమూడు హనుమ త్ప్రతిమలతో పూర్తియగును. అని మిన్నకుండెను.

శ్లో॥ రామోఽపి సహసుగ్రీవ స్సానుజ స్త చ్చకార హ
కార్యసిద్ధి రభూ త్తస్య - సుగ్రీవ శ్చ విభీషణః
విభీషణోఽపి రామో క్తం - వ్రతం కృత్వా యథోదితం
తదా ప్రభృతి లోకేఽస్మి న్విశ్రుతం హనుమద్వ్రతమ్॥

తా॥ రాముడు సుగ్రీవునితోను సోదరునితోను కూడి ఆ వ్రతము నాచరించెను. దానిచే కార్యసిద్ధి చేకూరెను. సుగ్రీవుడును, విభీషణుడును రామోక్తమగు ఆవ్రతమును యథోచితముగా ఆచరించి సత్ఫలితమందిరి. అప్పటినుండి లోకమునందు హనుమద్వ్రతము ప్రసిద్ధమైనది.

శ్లో॥ భవే త్సహాయో హనుమాన్ - కృతే తస్మిన్వ్రతే శుభే
తస్మా త్త్వయాఽపి కర్తవ్యం - వ్రత మేవ న్నృపో త్తమ॥

తా॥ ఈ శుభప్రదమైన వ్రతము నాచరించుటవలన హనుమంతుని సహాయము చేకూరును. కాన ఓ ధర్మరాజా! నీవుకూడ ఈ వ్రతము నాచరింపదగును.

శ్లో॥ మాసానాం మార్గశీర్షోహ - మి త్యుక్తం స్వామినా స్వయం
తస్మా త్త్వమపి తత్కృత్వా - లబ్ధరాజ్యో భవిష్యసి॥

తా॥ మాసములందు మార్గశిరమాసమును నేనే అని శ్రీకృష్ణ భగవానుడే భగవద్గీతలో చెప్పెను. కావున నీవుకూడ అట్టిమాసమున వ్రతమాచరించిన రాజ్యమును పొందగలవు.

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచ స్తస్య- సర్వేఽపి ముద మాయయుః
అథ సాయ మభూ త్తత్ర సూర్యే వారాశి మాగతే॥
నీత్వా రాత్రిం తతః ప్రాత రుత్థాయ చ స ధర్మజః
వ్యాసస్య పురత శ్చక్రే వ్రత మేత త్సవి స్తరమ్.

తా॥ అను వ్యాసుని మాటలువిని అందరు సంతసించిరి. ఇంతలో సాయం సమయమై సూర్యుడస్తమించగా ఆ రాత్రి గడిపి ఉదయమేలేచి

ధర్మరాజు వేదవ్యాసుని సమ్ముఖముననే సవిస్తరముగా హనుమద్వ్రతము నాచరించెను.

శ్లో॥ ఉద్యాపనం తథా హోమం సఘృతం పాయసైశ్శుభైః
మూలమంత్రోక్త సూక్తేన ప్రీతాంగ మకరో త్తథా॥

తా॥ ఆరీతిగా ధర్మరాజు హనుమద్వ్రత ఉద్యాపన మాచరించి అజ్య సిక్తమైన పాయసముచేత హనుమన్మూలమంత్రముతో హోమముచేసి వ్రతము సంపూర్ణమొనర్చెను.

శ్లో॥ సాక్షా ద్ధనుమతః పూజా పాంచాల్యా సహ కల్పితా
అథ సంవత్సరేఽతీతే - పాండవో రాజ్య మాయయౌ॥

తా॥ ధర్మపత్నియగు ద్రౌపదితో సాక్షాత్తుగా హనుమద్వ్రత మాచరించి సంవత్సరము గడువగనే రాజ్యమును పొందగల్గెను.

శ్లో॥ తస్మా త్కురుధ్వం మునయో - వ్రతానా ముత్తమం వ్రతం
ఇతి కృత్వా భవన్త శ్చ ప్రాప్తాభీష్ట మనోరథాః॥

కావున ఓ శౌనకాది మునులారా! వ్రతములన్నిట శ్రేష్టమైన హనుమద్వ్రతమును మీరు కూడ చేయుడు. అట్లు ఆచరించిన మీరుకూడ సఫల మనోరథులౌదురు అని సూతుడు చెప్పెను.

శ్లో॥ తేఽపి చక్రు ర్యథాన్యాయం -వ్రత మేత త్సుమంగళమ్

తా॥ అట్లు వ్రత మహాత్యమెరిగిన మునులందరు యథావిధిగా మంగళప్రదమగు హనుమద్వ్రతమాచరించిరి.

ఇతి శ్రీ హనుమద్వ్రత కథా యాంప్రథమోఽధ్యాయః

అథద్వితీయోఽధ్యాయః

సూతః

శ్లో॥ శృణుధ్వ మృషయ స్సర్వే - కథా మన్యాం వదా మ్యహం
పరాశరేణ కథితాం మైత్రేయా యాత్ర పృచ్ఛతే॥

తా॥ సూతుడు శౌనకాది మహామునుల కిట్లనియె. ఓ మునులారా

శ్రీ పరాశరులు మైత్రేయునకు చెప్పిన దానిని వేఱొక కధను మీకు చెప్పు చుంటిని. వినవలసినది.

మైత్రేయః -

శ్లో॥ హనుమద్వ్రత మిత్యుక్తం-పూర్వాధ్యాయే త్వయా మునే
కేనవాదౌ పురాచీర్ణం-తత్ఫలం వద మే విధిమ్॥

తా॥ మైత్రేయుఁడు చెప్పుచున్నాడు. ఓ పరాశర మహామునీ! మీచే వెనుకటి యధ్యాయమున హనుమద్వ్రతమని చెప్పఁబడినది. ఎవనిచేత పూర్వము దాని ఫలమందబడెను. ఆ విధము చెప్పఁగోరెదను.

శ్రీ పరాశర: —

శ్లో॥ అత్రానువర్ణయిష్యామి-కథాం పాప ప్రణాశినీమ్
యాం శ్రుత్వా మానవో నిత్యం-హనుమద్భక్తిమాన్ భవేత్॥

తా॥ పరాశరులు చెప్పుచున్నారు. దేనిని ప్రతిరోజు వినుట ద్వారా మానవుఁడు హనుమద్భక్తుఁడగునో యట్టి పాపనాశనకారియగు కథను వర్ణించెదను.

శ్లో॥ సోమదత్తో మహానాసీ-త్పురా సోమకులోద్భవః
రాజా పరమధర్మజ్ఞో-బంధుమా ననహంకృతిః॥

తా॥ పూర్వము చంద్రవంశము నం దుద్భవించినవాఁడు ధర్మము లన్నిటి నెఱిఁగినవాఁడు బంధుకోటితో కూడినవాఁడు అహంకార రహితుఁడు నగు రాజు సోమదత్తుఁడను మహనీయుఁడుండెను.

శ్లో॥ సత్యవాదీ సదామౌనీ-హ్యతిథేయో బహువ్రతః
సత్సు పూజాం ప్రకుర్వాణః- కిం ను శత్రుపరాక్రమైః॥

తా॥ అతఁడు సత్యము మాటాడువాఁడు, ఎల్లవేళల మౌనవ్రత నిష్ఠునివలె నుండి వాచాలత లేనివాఁడు, అతిధి పూజా నియమము మిక్కిలి కలవాఁడు, మంచివారిని పూజించువాఁడు, పరాక్రమవంతుడున్న

శ్లో॥ బుభుజే భువ మవ్యగ్రః- స రత్నాకరమేఖలామ్
తేన సంపీడితా రాజ్ఞా-సమేతాః శత్రవః పరే ॥

తా॥ కలవరము లేనివాఁడై సముద్రమే మొలనూలుగాఁగల భూమిని పాలించెను. శత్రువులందఱను నాశనము చేయుచుండువాఁడు. అట్టి వారందఱు కూడి

శ్లో॥ మాహిష్మతీపురం యాతాః-తై రాహూతో రణేతు సః
అక్షౌహిణీ సహస్రైశ్చ-హ్యాయుతైః కరిణాం ఘటైః ॥

తా॥ మాహిష్మతీపురమున కేగిరి. సోమదత్తుడు వారిచే యుద్ధమున కాహ్వానింపబడెను. కొన్నివేల అక్షౌహిణులసేనతోను, పదివేలనక్షౌహిణీల సేనతోను ఏనుగుల సమూహముతోను కూడినవారితో రణరంగమున

శ్లో॥ అశ్వైః కాశ్మీరజై స్తైస్తు-లక్షకోటిసమన్వితైః
సంగ్రామస్తుముల స్తస్య-సోమదత్తస్య తై రభూత్ ॥

తా॥ లక్షకోటుల కాశ్మీర దేశీయములగు గుఱ్ఱములతో కూడిన వారితో నా సోమదత్తునకు సంకుల సమరమేర్పడెను,

శ్లో॥ శక్తి తోమర ఖడ్గైశ్చ బిండివాలై స్సదాశ్శుభిః
యథా దైవాసురం యుద్ధం-తథాభూ త్క్రూరను వర్ణ్యతే॥

తా॥ బల్లెము, చిల్లకోల, ఖడ్గములు, ఇనుప మొనలు గల భిండివాలములను నాయుధములతోను, రాళ్ళతోను దేవదానవ సంగ్రామమువలె నా యుద్ధము జరిగెను. ఇంక నేమని వర్ణింపనగును?

శ్లో॥ పరైర్జిత బలస్సంఖ్యే -నిశి సంగృహ్య దేవికామ్
స్త్రియమంతః పురా త్తస్మా - త్ప్రాగా గార్గ్యాశ్రమం ప్రతి

తా॥ శత్రువులచే జయింపబడినవాఁడై రాణి దేవికతో నంతః పురము నుండి గార్గ్య మహాముని యాశ్రమమున కేగెను.

శ్లో॥ తత్రైవ పంచమాసాస్తు-స్థిత్వా శోకసమన్వితః
పంగుత్వమపి మూకత్వ-మంధత్వ మగమ న్నృపః ॥

తా॥ అక్కడనే శోకముతో కూడినవాఁడై అయిదు మాసములుం డెను. పిదప కుంటి, మూగ, గ్రుడ్డితనములఁ బొందెను.

శ్లో॥ రాజభ్రష్టం పతిం ధీరా-ప్రాప్తుకామం పునః ప్రియమ్
ప్రలపంతం ముహుః పుత్రాన్-హతాన్ యుద్ధేషు దుర్లభాన్॥

తా॥ ధైర్యముకల యతని భార్య రాజ్యభ్రష్టుడైన, మరల కష్టమును పొందగోరెడు పతిని గూర్చి మిక్కిలి విచారించుచున్న వానిని గూర్చి యుద్ధమునందు చనిపోయిన బిడ్డల విషయమై దుర్లభములగు

శ్లో॥ శ్రియం రాజ్యం చ భోగం చ-సముద్దిశ్య పునః పునః
అశ్వాసయంతీ సా దేవీ - జగౌ శ్లోక చతుష్టయమ్॥

తా॥ సంపద, రాజ్యము, భోగముల విషయమై మాటిమాటికి నోదార్చునదై నాల్గు శ్లోకములను చెప్పెను.

శ్లో॥ ధైర్యం విపత్తౌ కర్తవ్యం సంపత్తౌ చ క్షమాపరా
వాచాలత్వం సభామధ్యే - తద్వై శాస్త్ర పురస్సరమ్॥

తా॥ ఆపదలందు ధైర్యము సంచిత సంపదలందు నోర్పు సభల యందు శాస్త్ర విషయముల బాగుగ మాటాడు గుణము కర్తవ్యము.

శ్లో॥ విక్రమం యుధి కర్తవ్యం - స్థిరత్వం స్త్రీ సమీపతః
ఐశ్వర్యే చ తథా క్షాంతి - ర్భక్తిశ్చైవత్తు భూసురే॥

తా॥ యుద్ధమునందు పరాక్రమము, స్త్రీలకడ నచంచలత, సంపద లేర్పడినప్పుడోర్పు బ్రాహ్మణునియందు భక్తియు గర్తవ్యము.

శ్లో॥ భవితవ్యం భవత్యేవ- నారికేళఫలాంబువత్
గంతవ్యం గచ్ఛతి సదా - గజభుక్త కపిత్థవత్

తా॥ కాదగినది యగుచునేయుండును. కాకమానదు. ఎట్లన కొబ్బరి కాయలో నీరు ఎవ్వరు పోయకున్నను సమయమున నేర్పడుచుండును కదా! పోయేది యెట్లును పోవును. ఎట్లన ఏనుగు వెలగపండును మ్రింగగా

దానిలో గుజ్జు హరించుకుపోయి శూన్యమగు డొల్ల తిరిగివచ్చును. కన్పడ కుండ లోనిది మాయమగును.

శ్లో॥ యద్భావి తద్భవత్యేవ- యదభావి న తద్భవేత్
ఇతి నిశ్చిత బుద్ధీనాం - నచింతా బాధతే క్వచిత్॥

తా॥ ఏదికానున్నదో అది కాకమానదు. కాదగినది కాదుకూడ. ఈ ఆలోచనను నిశ్చయించుకొనియున్న వారికి చింతయుండదు.

శ్లో॥ ఏవం మనీషిణః ప్రాహు- ర్నీతిశాస్త్రవిదో నృప
ముంచశోకం చ మోహం చ చింతాం దేహవినాశినీమ్

తా॥ ఈ రీతిగా నీతిశాస్త్రకోవిదులగు పండితులు చెప్పుదురు. కావున ఓ రాజా! నీవు శోకమును, పోయిన వానిపై ప్రేమను, దేహమును నాశనముచేయు చింతను వీడుము.

శ్లో॥ గార్గ్యాశ్రమోయం రాజేంద్ర - ప్రాపయిష్యే తదంతికమ్
స దాస్యతి ధర్మాత్మా సర్వా న్కామా న్సుదుర్లభాన్।

తా॥ రాజా ఇది గార్గ్యాశ్రమము. దాని సమీపమునకు ప్రవేశించు చున్నాము. ఆ ధర్మాత్ముడు దుర్లభములగు కోర్కెల నైతమీయగలడు,

శ్లో॥ సాంత్వయిత్వా తతో వీరం - నృపతిం రాష్ట్ర వర్జితమ్
అశక్తం గమనే దేవి - బిభ్రతీ నిజకందరే॥

తా॥ అని యూరడించి పిదప రాష్ట్రము వీడిన వీరుడగు నశక్తుడై నడవలేని వానిని అతని భార్య గుహలయందు భరించుచు

శ్లో॥ ప్రాపయామాస ముదితా - గార్గ్యాశ్రమ మకల్మషమ్
పతిం తత్ర ప్రతిష్ఠాప్య, మునిం నత్వా పునః పునః

తా॥ పాపరహితమగు నాగార్గ్యాశ్రమమును ఆమె చేర్చెను. అతని నటనుంచి పలుమార్లు మునికి నమ్రురాలై

శ్లో॥ కంపమానా తదా సాధ్వీ పీనోన్నత పయోధరా
చంద్రాననా సుకేశీ చ బింబోష్ఠి మంజుభాషిణీ॥

తా॥ అప్పుడు సాధ్వియైన బలిసి యున్నతములగు కుచములుకల, చంద్రునివంటి వెంట్రుకలుకల, దొండపండు వంటి పెదవికల మధురముగ మాటలాడగల,

శ్లో॥ కర్ణాంతనయనా బాలా - చంద్రికామలినచ్ఛవిః
దేవికాదేవి మధ్యా సా - పంచవింశతి వార్షికా॥

తా॥ చెవులవఱకు వ్యాపించిన నేత్రములుకల వెన్నెలవలె స్వచ్ఛమగు కాంతికల దేవికయను ఇరువదియైదేండ్ల ప్రాయముకల

శ్లో॥ కోమలాంగీతు సా దేవీ శ్యామలా చోత్పలేక్షణా
మునిం ప్రోవాచ ధర్మిష్ఠా పాహిపాహీతి మే పతిమ్॥

తా॥ కోమలములగు నవయవములు కలదియు, శ్యామలవర్ణము కలదియు కలువకటి పడకుచు ధర్మరతి కలదై మునిని 'రక్షింపుము పతిని రక్షింపు'మని వేడెను.

శ్లో॥ భగవ న్నృతి నాసార్ధ మాగతా శత్రుపీడితా
రాజ్యభ్రష్టో హ్యయం రాజా త్వామేవ శరణం గతః

తా॥ మహానుభావా! శత్రువులచే పీడింపబడి పతితో కూడివచ్చితిని. ఈ రాజు రాజ్యమునుండి తొలగినవాడు. మిమ్మే శరణుపొందియున్నవాడున్ను.

శ్లో॥ మునిస్తత్ర చిరం ధ్యాత్వా ధ్యానమార్గేణ చక్షుషా
దృష్టవా న్సర్వ మేవైత ద్రాజ్ఞ స్తస్య మహాత్మనః

తా॥ మునియప్పుడు మిక్కిలి ధ్యానముచేసి ధ్యానమార్గ నేత్రముతో చూచి సమస్తమగు విషయమును తెలిసికొనెను.

శ్లో॥ ఉవాచ మునిశార్దూలో - రాజానం మహిషీసఖమ్॥

తా॥ మునిసత్తముడగు గర్గుడు రాణీ ప్రియుడగు రాజునుగూర్చి యిట్లు చెప్పదొడగెను.

గర్గోవాచ

శ్లో॥ యువయోః కష్ట మత్యుగ్రం సర్వ్యాభావం సు దుస్సహామ్
యేనేద మీ దృశం ప్రాప్తం తద్బ్రవీమి హితేఽధునా
స్సకృద్వా పృత్తమా విద్యానోపాస్తా విజయప్రదా॥

తా మీకేర్పడిన కష్టము చాలా గొప్పది. ఏమియు లేమిచే మిక్కిలి సహింపరానిది. దేనివలన నీ విధి యేర్పడినది చెప్పెదను. విజయము నీయగల ఉత్తమమంత్రమును నీవనుష్టించలేదు.

శ్లో॥ కృతానిన త్వయా వీర హ్యుత్తమాని వ్రతాన్యపి
తశ్మాత్త్వ మీదృశం ప్రాప్తో గతిం దురవభోధనామ్॥

తా॥ ఓ రాజా! నీచే నుత్తమమగు వ్రతములు చేయబడలేదు అందుచే నీవిట్టి భరింపరాని గతులబడితివి.

రాజా ఉవాచ

శ్లో॥ ఉపాసనాయ విద్యానా మశక్తోహం వ్రతేషు చ
యథాశక్త్యా కరిష్యామి తథాపి భగవన్మునే॥

తా॥ రాజు చెప్పుచుండె ఓ భగవంతుడగు గర్గమునీ! మంత్రో పాసన విషయమున, వ్రతమునందును నశక్తుడను. అయినను శక్తికొలది చేయగలను.

శ్లో॥ సర్వమంత్ర మహారాజ విద్యా మేకాం ఫలప్రదామ్
శ్రేష్టం వ్రతానాం సర్వేషా మేకం దీనాయా మే వద॥

తా॥ అన్ని మంత్రములకు మహారాజువంటి దానిని ఫలప్రదమగు నట్టి దానిని అన్ని వ్రతములకంటే శ్రేష్టమైన ఒక మంత్రమును దీనుడ నగు నాకు చెప్పుడు.

శ్లో॥ వాత్సల్యవంత స్సర్వేషు-యూయం దీనేషు సర్వదా
యద్యపి మయి కారుణ్యం-కురుశిష్యే స్వనుగ్రహామ్॥

తా॥ తమరు అందఱియందును వాత్సల్యముకలవారు ఎల్లప్పుడు దీనులయెడ ప్రేమకలవారు. నాయందును ఆరీతి కరుణ గలవారై యున్నను నేను మీకు శిష్యుడనైతిని. అనుగ్రహింపుఁడు.

శ్లో॥ ఇత్యుక్తస్తేన రాజ్ఞాథ-వృద్ధగార్గ్యో మహామునిః
క్షణం ధ్యాత్వా నృపం ప్రాహ-శ్రూయతా మిహ షట్రక॥

తా॥ ఈ రీతిగా రాజుచేఁ జెప్పఁబడగా కీర్తిమంతుఁడగు నా వృద్ధగార్గ్యుఁడు క్షణము ధ్యానించి రాజుతో కుమారా! వినుము.

శ్లో॥ రాజ న్సకలవిద్యానాం-సారభూతో హనూమతః
పంచవక్త్రాఖ్య విద్యాస్తి-తాం దదామి నృపోత్తమ॥

తా॥ ఓ రాజా! సమస్త విద్యలకు సారభూతమైన హనుమత్పంచవక్త్రి విద్యయనుపేర నొక విద్యకలదు నృపశ్రేష్ఠా! దాని నిచ్చెదను.

శ్లో॥ సద్యో దురితరాశిఘ్ని-సకలార్తి నివారిణీ
అనాయాసేన జయదా-సామ్రాజ్య ఫలదాయినీ॥

తా॥ అది వెంటనే పాపములన్నింటిని పోగొట్టునది. సమస్తములగు బాధలను నివారించునది సులభముగా జయము నిచ్చునట్టిది, సామ్రాజ్యమును నిచ్చునది.

శ్లో॥ తాం జపస్వ మహాబాహో-జయసిద్ధి ర్భవిష్యతి
అన్యచ్చ తవ వక్ష్యామి - వ్రతం శ్రీహనుమత్ప్రభోః॥

తా॥ ఓదీర్ఘభుజుఁడా దానిని జపించుము. వెంటనే జయసిద్ధి కల్గును. హనుమత్ప్రభువుని వ్రతముఁదెల్పెద వినుము.

శ్లో॥ సద్యస్సమస్తఫలదం-సతతం విజయప్రదమ్
వైశాఖే దశమీ కృష్ణ-అమావాస్యా తతఃపరమ్॥

తా॥ అది వెంటనే సప్తసములగు పరియోజనముల నిచ్చునది. యెల్లప్పుడు విజయ మిచ్చునది. వైశాఖమాస కృష్ణపక్ష దశమినాడు లేదా ఆపై అమావాస్యనాడైన

శ్లో॥ మాఘాది పంచమాసేషు–ఏకస్మిన్ శుక్లపక్షకే
మందవాసర ఆద్యస్య–తారం మృగశిరోఽథిదమ్।

తా॥ మాఘమాసము మొదలు ఐదుమాసములందు శుక్లపక్షమున మొదటి శనివారమునకాని మృగశిరా నక్షత్రమునకాని

శ్లో॥ శ్రావణే పౌర్ణమీ చైవ కార్తికే ద్వాదశీ తథా
మార్గశీర్షే తథా శుక్లే – సంప్రోక్తా చ త్రయోదశీ॥

తా॥ శ్రావణ మాసమున పౌర్ణమి యందుగాని, కార్తీకమాస శుద్ధద్వాదశియందు అట్లే మార్గశిర శుద్ధ త్రయోదశియందుగాని ఈ వ్రత మాచరింప(ప)జెప్పబడినది.

శ్లో॥ ఏతేషు దివసే ష్వేక–దివసే వ్రత మాచరేత్
భక్తిమాంశ్చే త్సర్వదినే ష్విదం వ్రత మథాచరేత్॥

తా॥ పైవానిలో నొకరోజు వ్రతమాచరింపవలెను. భక్తిమంతుండైన యెడల నన్నిరోజులందు నీ వ్రత మాచరింపవచ్చును.

శ్లో॥ ఏకస్మి న్తోరకం బద్ధ్వా – పూజామాత్రం తతఃపరమ్
కుర్యా చ్ఛ్రీవాయుపుత్రస్య – దివసే ష్వపరే ష్వధ॥

తా॥ వ్రతారంభముననే తోరమును కట్టుకొని పిదప పూజ నాచరింపనగును. హనుమత్పూజను మిగిలినరోజులందును ఆచరింపవచ్చును. తోరము మాత్రము మార్చనవసరములేదు.

శ్లో॥ బ్రాహ్మే ముహూర్తే సాయం వా–మధ్యాహ్నే ప్రాతరేవ వా
పూజయే దంజనాసూనుం–గురో రాజ్ఞాపురస్సరమ్॥

తా॥ ముందుగా గురుననుమతి పొందినవా(డై బ్రాహ్మే ముహూర్తమునందు అనగా తెల్లవారుఝాము వేదాధ్యయనము చేయువేళ అనగా

సూర్యోదయమునకు ముప్పావుగంట ముందుగాని, సాయంత్రముకాని మధ్యాహ్నముగాని, యుదయముకాని హనుమంతునిఁ బూజింప నగును.

శ్లో॥ స్వర్ణ రాజిత తామ్రేషు-భూర్జే వా స్థండి లేంభసి
క్షౌమే వా పూజయే ద్ధీమాన్యంత్రే వా ప్రతిమాసు వా॥

తా॥ బంగారము, వెండి, రాగి మొదలగు యంత్రములయందుఁ గాని భూర్జపత్రమునందుగాని, పిండితో వేసిన యంత్రమందుగాని ఉదక పూరితమగు కలశ మందుఁగాని, పట్టుగుడ్డయందుగాని, ప్రతిమలయందుఁ గాని ఆవాహన మొనర్చి పూజింపనగును.

శ్లో॥ త్రయోదశ గ్రంధియుక్తం-ధృత్వా తోరక ముత్తమమ్
త్రయోదశ ఘృతపూప వాయనం తత్ర దాపయేత్॥

తా॥ పదుమూఁడు ముడులఁగూడిన తోరమును ధరించవలెను. పదమూడుఁ నేతియప్పములు వాయనమీయ వలెను.

శ్లో॥ గురుం సంపూజ్య విత్తాద్యై-ర్విత్తశాఠ్య వివర్జితః
విత్తశాఠ్యకృతం కర్మ-పుణ్యం తన్నిష్ఫలం భవేత్॥

తా॥ ధనాదికముచే లోపముచేయక గురువును పూజింపవలెను. విత్తలోభముతో పూజించుట నిరర్థకమే.

శ్లో॥ బ్రాహ్మణై స్సహ భుంజీయా-ద్యథాశక్తి సమాహితః
త్రయోదశ చ వర్షాణి-సిద్ధికామ స్సమాచరేత్॥

తా॥ శక్తిననుసరించి బ్రాహ్మణ సమారాధనము గావించి వారితో భోజనము చేయనగును. సిద్ధిని కోరిన వాడై పదమూఁడేండ్లు చేయనగును. సకల కార్యసిద్ధులు సమకూడును.

శ్లో॥ అనేన సకలా ఇ శత్రూన్దు ర్ధర్షా సమరై రపి
విజిత్య సుమహాద్రాజ్యం-చిరకాల మవాప్స్యసి॥

తా॥ దీనిచే జయింప దుర్లభులగు శత్రువుల నందఱను, దేవతల

నైనను జయించి చిరకాలము గొప్పరాజ్యము లభించినవాఁడవై యుందువు.

శ్లో॥ భవిత్రీ పూర్వసంపత్తి – స్తవ శ్రీః కీర్తిసంయుతా

తా॥ నీ వెనుకటి సంపద, కీర్తి, పుత్రులు అన్నియు కల్గును

శ్లో॥ ఇ త్యుక్తో గార్గ్యమునినా సోమదత్తో మహీపతిః

పత్న్యాసార్థం మహావిద్యాం పంచవక్త్రహనూమతః

తా॥ ఈ రీతిగా గార్గ్యమహామునిచే – సోమదత్తుడు పంచవక్త్రహనూమత్సంబంధమగు మహావిద్యను భార్యా సహితుఁడై చెప్పబడినవాడై

శ్లో॥ గురో స్సమీపే కృత్వాథ–వసన్ తద్వ్రత ముత్తమమ్

సంప్రాప్య సద్య శ్చాయుష్మాన్–కందర్పసమ రూపవాన్॥

తా॥ గురు సమీపముననేయుండి యాయుత్తమ వ్రతము నొనర్చిన వాఁడై వెంటనే యాయుష్మంతుడు, మన్మధ సమానమగు రూపము కలవాఁడు నగు నతఁడు.

శ్లో॥ హనూమతః ప్రసాదేన ఖడ్గసిద్ధి మవాప్తవాన్

తత స్సమస్తారిగణా–నేకాహ్నైవ విజిత్య చ॥

తా॥ హనుమదనుగ్రహముచే ఖడ్గసిద్ధినందిన వాఁడాయెను. అటు పిమ్మట ఒక్క పగటియందే సమస్త శత్రువులను జయించి

శ్లో॥ స్వరాజ్యం పాలయామాస–గార్గ్యం కృత్వా పురోహితమ్

స్వర్ణ కోటి సహస్రాణి–తస్మా ద్గార్గ్యో మహామునిః

తా॥ గార్గ్య మహామునిని పురోహితునిగాఁ చేసికొని తన రాజ్యమును పాలింపజొచ్చెను. అందుచే గార్గ్య మహాముని కోటి సహస్రముల బంగారునాణెములు

శ్లో॥ సంప్రాప్త వర్ష సాహస్రం–సత్రయాగ మథాకరోత్

శ త్తద్వైపవలీం ధాత్రీం–గార్గ్యానుగ్రహముతో నృపః ॥

తా॥ పొంది వేయి సంవత్సరములు సత్రయాగము చేసెను. గార్గ్యానుగ్రహమువలన రాజగు సోమదత్తుడు సప్తద్వీపవతియగు భూమిని

శ్లో॥ పాలయామాస ధర్మాత్మా, త్రింశ ద్వర్ష సహస్రకమ్
అష్టాన్ పుత్రా నవాప్యాథ-జ్యేష్ఠం రాజ్యేఽ భిషిచ్య చ॥

తా॥ మూడువందల సంవత్సరములు ధర్మాత్ముడై పాలించెను. ఎనమండుగురు పుత్రులనుకడిసినవాడై పెద్దకొడుకుని రాజ్యాభిషిక్తునిచేసి

శ్లో॥ బ్రహ్మలోక మవా పాంతే-పత్న్యాసహ మహాయశాః
హనుమతో వ్రత స్యైవం-ప్రభావో మునిపుంగవ॥

తా॥ చివరకు నాకీర్తివంతుడు భార్యతోగూడిన వాడై బ్రహ్మలోకమందెను. మునిశ్రేష్ఠుడవగు మైత్రేయా! హనుమంతుని వ్రతము యొక్క ప్రభావమిట్లుండును.

శ్లో॥ శ్రుతోవా పఠితో ద్యైశ్చ - సర్వదా విజయప్రదః

తా॥ ఈ వ్రతమును విన్నను, పఠించినను ఎల్లప్పుడు విజయము నిచ్చును.

ఇతి శ్రీహనుమద్వ్రత కథాయాం సోమదత్త చరిత్ర కథనం
నామ ద్వితీయోఽధ్యాయం

## అథతృతీయోఽధ్యాయః

శ్రీ పరాశరః—

శ్లో॥ అత్రార్థే సంప్రవక్ష్యామి- పూర్వవృత్తాంత మద్భుతం
విభీషణసుత శ్రీమా న్నీలోనామ మహాబలః
సర్వవిద్యాసు నిష్ణాతో- నిత్యం ధర్మపరాయణః॥

తా॥ శ్రీ పరాశర మహర్షి చెప్పుచున్నారు, ఓ మైత్రేయమునీ! ఈ విషయంలో అద్భుతమగు ఒక పూర్వవృత్తాంతమును చెప్పెదను

వినుము. విభీషణుని కుమారుడు నీలుడనువాడు మహా బలవంతుడు, విద్యలన్నిటిని నేర్చినవాడు, నిత్యము ధర్మ పరాయణుడున్ను.

శ్లో॥ స ఏకదా మహారాజం- విభీషణ మరిందమం
ఉవాచ భగవ న్నస్మిన్- పురే లక్ష్మీ రచంచలా॥

తా॥ ఆ నీలు డొకనాడు శత్రునాశకుడగు విభీషణ మహారాజును చూచి ఇట్లు పల్కెను. ఓ ప్రభూ! ఈ లంకా పట్టణమున సంపద స్థిర ముగా నున్నది.

శ్లో॥ త్వదధీనం మహారాజ్య - మిదం లంకాపురస్యతే
ధనధాన్యాకులం సర్వ-మపి భోగసమన్వితమ్॥

తా మీ యాధీనమందున్న యీ లంకారాజ్యము ధనధాన్య సమృద్ధమై అన్ని భోగములతో కూడియున్నది.

శ్లో॥ అనర్ఘ ముక్తారత్నాద్యై- ర్దివ్య జాంబూనదాదికైః
ఇదం పురం చ రాష్ట్రం చ- సుఖసంప త్సమన్వితమ్॥

తా॥ ఎనలేని ముత్యములు, మున్నగువానితోను, సువర్ణాదికము తోను పీ పట్టణము, రాజ్యమంతయుగూడ సుఖసంపదలతో నున్నది.

శ్లో॥ తథాపి పుర్యాం రాష్ట్రే వా- తవ రాజగృహేపి వా
చింతామణిః కామధేనుః- కల్పవృక్షో నదృశ్యతే

తా॥ అయినప్పటికి లంకాపట్టణమునఁగాని రాష్ట్రమందుకాని తమ రాజగృహమందుఁగాని చింతామణి, కామధేనువు, కల్పవృక్షము మాత్రము కాన్పించుటలేదు.

శ్లో॥ సాక్షాత్త్వం జానకీనాథ- చరణాంభోజ సేవయా
సంప్రాప్య మహదైశ్వర్యం- మహారాజోసి సువ్రత!

తా॥ సద్ద్వైతనిష్ఠా గరిష్ఠుఁడా; నీవు సాక్షాత్తు జానకీ పతియగు శ్రీరామచంద్రుని పాదసేవచే గొప్పసంపదను పొంది మహారాజు వైతివి.

శ్లో ॥ చింతామణ్యాదయో భోగా- న సంప్రాప్తాః కథం త్వయాది
యద్యాజ్ఞా దీయతే మహ్యా- మానేష్యే త త్ప్రియం పునః ॥

తా॥ చింతామణి మొదలగు భోగములను నీ వెందులకు పొంద లేదు? నా కాజ్ఞనిచ్చినయెడల నా మూడింటిని తీసుకొని రాగలను.

విభీషణ ఉవాచ -

శ్లో ॥ శ్రీరామ చరణాంభోజ- మకరంద సుధారసే
భృంగాయతే మమ మన- స్సతతం నీలబాలక ॥

తా॥ విభీషణుఁడు పల్కెను- ఓ కుమారా! నీల! శ్రీరామ చంద్రుని పాదమనెడు పద్మమునందలి తేనెకై నా మనస్సు తుమ్మెదగానై తిరుగుచుండును:

శ్లో ॥ బ్రహ్మానంద రసాంభోధే- మగ్నోహం తత్ప్రసాదతః
తత్ప్రసాదా న్మయా ప్రాప్తం- మహదైశ్వర్య మక్షయమ్॥

తా॥ అతని యనుగ్రహముచే బ్రహ్మానందమను సముద్రమున మునిగియున్నాను శ్రీ రాముని యనుగ్రహముచేతనే నాకు నాశముకాని గొప్ప ఐశ్వర్యము లభించినది.

శ్లో ॥ దీర్ఘాయుష్యం చ సామ్రాజ్యం- దుర్లభం య త్సురైరపి
చింతామణిః కల్పతరుః- కామధేను స్స ఏవ మే॥

తా॥ అంతియకాక దీర్ఘాయువు, దైవతలకైనసాధ్యముకాని సామ్రాజ్యము లభించినవి. నా కా రాముఁడే చింతామణి, అతఁడే కల్పతరువు. కామధేనువు కూడ.

శ్లో ॥ ఏకాంశేనాపి వైకుంఠే- హరే శ్చరణకింకరః
ఏకాంశేన మయా ప్రాప్తం- పరమైశ్వర్య మక్షయమ్॥

తా॥ ఒక్కయంశవలన నాచే నక్షయమగు మహైశ్వర్యము పొంద బడినది. ఒక్క అంశచే వైకుంఠమునందు హరికి చరణదాసుఁడనుకూడ నైతిని.

శ్లో॥ శ్రీ జానకీశ కృపయా- శక్రాద్యా లోకపాలకాః
మద్వశే సంస్థితా దేవాః- కిము మర్త్యా మహీతలే॥

తా॥ శ్రీ జానకీపతి దయవలన దేవేంద్రాది దిక్పాలు రందఱు నాకు వశులై యున్నారు. ఇక భూలోక వాసులగు మానవులఁ గూర్చి చెప్పనేల?

శ్లో॥ కిమల్పసారై ర్రత్నై నీల- చింతామణ్యాదికై రపి
ఇత్యుక్త్వాస మహారాజో- నీలం ధర్మపరాయణః॥

తా॥ ఇక నల్పప్రయోజనముకల చింతామణ్యాదులతో నా కేమి కలదు పుత్రకా? నీల! అని ధర్మపరాయణుడగు విభీషణుఁడు నీలునితో ననెను.

శ్లో॥ అథాస్యాపి యశోభూయా- దితి ధ్యాత్వాఽబ్రవీత్పునః
చింతామణిః కల్పతరుః- కామధేను స్సురాలయే॥

తా॥ అటు పిమ్మట తన పుత్రునకు కీర్తి రావలనని యోచించిన వాఁడై మరల పల్కెను. దేవలోకమున చింతామణి, కల్పతరువు కామ ధేనువు కూడ.

శ్లో॥ అమరై రేవ భుజ్యంతే- దివ్యరత్నాని సర్వదా॥

తా॥ ఎల్లప్పుడు దేవతల చేతనే యనుభవింపబడుచున్నవి.

శ్లో॥ అకృ త్వాచార్యశుశ్రూషా మనుపాస్య చ దేవతాః
భోక్తుం న శక్యతే దివ్య రత్నజాతం మహీతలే॥

తా॥ అ దివ్యరత్న జాతయ గురుశుశ్రూష చేయక, దేవతల నుపాసించక అనుభవించుటకీ భూలోకమున శక్యము కాదు.-

శ్లో॥ తవాపేక్షా స్తిచే ద్దివ్య రత్నజాతేషు పుత్రక
కురు ష్వాచార్య శుశ్రూషాం స తే శ్రేయః ప్రదాస్యతి॥

తా॥ కుమారా! దివ్యరత్నములయెడల నీకు కోరిక యున్నయెడల గురుశుశ్రూషను చేయుము. అతఁడే నీకు శ్రేయము లీయఁగలడు.

శ్లో॥ ఇత్థం విభీషణే నోక్తో- నీలః పుత్రో మహాత్మనా
ఆజ్ఞాం ప్రగృహ్య శిరసా- పితరం ప్రణిపత్యచ ॥

తా॥ ఈ రీతిగా పుత్రుఁడగు నీలుఁడు మహాత్ముఁడగు విభీషణునిచేఁ జెప్పబడినవాఁడై ఆజ్ఞను శిరసావహించి తండ్రికి నమస్కరించి

శ్లో॥ జగామ భార్గవం శుక్రం- సేవార్థం గురు మాదరాత్
పాదసంవాహనాద్యైశ్చదీప్త రత్నాదికార్పణైః ॥

తా॥ గురువగు శుక్రాచార్యుని సేవింప నాదరముతో నేగెను. పాదము లొత్తుట వంటివానిచేతను, ప్రకాశమానములగు రత్నాదుల నర్పించుట చేతను

శ్లో॥ భార్గవం తోషయామాస- దశ ద్వాదశ వత్సరాన్
సంతుష్ట త్వే కదా తస్య- భార్గవ స్తపసాంనిధిః ॥

తా॥ పది పండ్రెండేండ్లు శుక్రాచార్యుని సంతోష పెట్టెను. సేవకు సంతోషించినవాడై తపోనిధియగు భార్గవుఁడొకప్పుడు

శ్లో॥ కిమభీష్టం కరోమితి- నీలం ప్రాహ మహామతిః
సోఽపి విజ్ఞాపయామాస స్వాభీష్టం సర్వ మద్భుతమ్ ॥

తా॥ నీలుని నీ కోరిక యేమియో చెప్పుమని యా మహానుభావుఁ డడిగెను. అతఁడు కూడ అద్భుతమగు తన కోర్కెను విన్నవించెను.

శ్లో॥ సుప్రీతో భార్గవః ప్రాహ — తతో నీలం మహాసురమ్
రాజ్ఞీం సకల విద్యానాం - సద్య స్సిద్ధి విధాయినీమ్॥

తా॥ అందుకు ప్రీతుఁడై రాక్షస జాతివాఁడగు నీలునితోభార్గవుఁ డిట్లుచెప్పెను. అన్ని విద్యలకు మహారాణియనదగిన వెంటనే సిద్ధించునట్టి

శ్లో॥ ఉపదేక్ష్యామి తే విద్యాం - వ్రతం చాను త్తమం భువి
యేన తే దివ్యరత్నానాం ప్రాప్తి శ్శుక్రాదికైరపి

తా॥ విద్యను, శ్రేష్ఠమగు వ్రతమును ఉపదేశించుచున్నాను. అది ఎట్టిదన దేనిచేత నీకు దివ్యరత్నములు ప్రాప్తించునో మఱియు దేవేంద్రాదులకైన

శ్లో॥అజేయత్వ మవధ్యత్వం – దీర్ఘాయుష్య మనుత్తమమ్
కించ తే కీర్తి రచలా – జగతి స్థాస్యతి ధ్రువమ్॥

తా॥: జయింపనలవికాని, చంపశక్యముకాని గుణములను శ్రేష్ఠమగు దీర్ఘాయువును నగునో, నీ కీర్తి స్థిరమై జగత్తున నిలవగలవో అట్టి దానిని

శ్లో॥ నక్షత్రం మృగశీర్షాఖ్యం-శ్వో నక్షత్రోత్తమం శుభమ్
కురు శ్రీరామదూతస్య – పంచవక్త్ర హనూమతః

తా॥ రేపు నక్షత్రము మృగశిర. మృగశీర్ష నక్షత్ర మీ విద్యకు యోగ్యమైనది. కావున శ్రీరామునకు:దూతయగు పంచవక్త్రహనుమంతునకు సంబంధించిన

శ్లో॥ వ్రతం సమస్తఫలదం-సద్య స్సిద్ధి విధాయకమ్
ఇత్యుక్త్వోపాదిశ ద్విద్యాం – ఆంజనేయస్యమారుతేః॥

శ్లో॥ వ్రతము సమస్త ప్రయోజనముల నొసంగునది, వెంటనే సిద్ధించునది కూడ కాన నాచరింపుము అని ఆంజనేయ సంబంధమగు విద్య నుపదేశించెను.

శ్లో కారయామాస హనుమ – ద్వ్రతం పరమశోభనమ్
వ్రతాంతే భార్గవగురుం – రత్నై రర్ఘై శ్చ పుష్కలైః
పూజయిత్వా మహావిద్యాం – జపన్నాస్తే సమాహితః

తా॥ పరమశోభనమగు హనుమద్వ్రతము కూడ చేయించెను. నీలుడు వ్రతాంతమున గురుడగు భార్గవుని రత్నధనాదులతో నుచిత రీతిని బూజించి యాతడొసగిన మహావిద్యను జపించుచు నుండెను

శ్లో॥ తతః శ్రీరామచంద్రస్య - సచివానా మథాగ్రణీః
ప్రాదురాసీ త్త్రయంత్రింశ - త్కోట్యర్బుదగ జై ర్వృతః॥

తా॥ ఇట్లు జపించినంతట శ్రీరామచంద్రుని దాసులలో ముఖ్యుఁడగు హనుమంతుఁడు ముప్పదిమూడు కోట్ల యర్బుదముల సేవకా గణముతో (అర్బుదమనఁగా వేయికోట్లు) ప్రత్యక్షమయ్యెను

శ్లో॥ తం దృష్ట్వా సహ సోత్థాయ-ప్రాంజలిః పురతః స్థితః
తుష్టావ నీలో ధర్మాత్మా -స్తోత్రైః పవననందనమ్॥

తా॥ అట్లు ప్రత్యక్షమైన యా హనుమంఁ జూచి వెంటనే లేచి ఎదురుగనున్నవాఁడై దోసిలొగ్గి యా నీలుఁడు వాయుసుతుఁడగు నా పరాత్పరు నాంజనేయుని ధర్మాత్ముఁడై ఈ రీతిగ స్తోత్రము చేసెను.

## నీలకృత ఆంజనేయస్తోత్రమ్

ఓం జయ జయ ః శ్రీ ఆంజనేయ ః కేసరీప్రియనందన ః వాయుకుమార ః ఈశ్వరపుత్ర ః పార్వతీగర్భసంభూతః వానర నాయక ః సకల వేదశాస్త్రపారగ ః సంజీవి పర్వతోత్పాటనః లక్ష్మణ ప్రాణరక్షకః గుహ ప్రాణదాయకః సీతా దుఃఖ నివారిణ ః ధాన్యమాలీ శాపవిమోచనః దుర్దండీ బంధవిమోచనః నీలమేఘ రాజ్యదాయకః సుగ్రీవ రాజ్యదాయకః భీమసేనాగ్రజః ధనంజయ ధ్వజవాహనః కాలనేమిసంహారః మైరావణమర్ధనః వృత్రాసురభంజనః సప్తమంత్రిసుతధ్వంసనః ఇంద్రజిద్వధకారణః అక్షకుమార సంహారః లంఖిణీ భంజన ః రావణమర్దనః కుంభకర్ణవధపరాయణః జంబుమాలి నిషూదనః వాలినిబర్హణః రాక్షసకుల దాహనః అశోకవనవిదారణ ః లంకాదాహకః శతముఖవధకారణః సప్తసాగరవాల సేతుబంధనః నిరాకార నిర్గుణ సగుణస్వరూపః హేమవర్ణ పీతాంబర ధరః సువర్చలా ప్రాణ నాయకః త్రయ త్రింశత్కోట్యర్బుద రుద్రగణపోషకః భక్తపాలనచతురః కనకకుండలాభరణః రత్న కిరీటహార నూపుర శోభితః రామభక్తితత్పర

హేమరంభావన విహార; వక్షతాంకిత మేఘవాహక; నీలమేఘశ్యామ; సూక్ష్మ కాయః; మహాకాయ; బాలసూర్యగ్రసన; ఋష్యమూకగిరి నివాసక; మేరు పీఠకార్చన; ద్వాత్రింశదాయుధధర; చిత్రవర్ణ; విచిత్రసృష్టి నిర్మాణకర్త; అనంతనామ; దశావతార; అఘటన ఘటనాసమర్థ; అనంత బ్రహ్మాండ నాయకః; దుర్జన సంహార; సజనరక్షక; దేవేంద్రవందిత; సకలలోకారాధ్య; సత్యసంకల్ప; భక్త సంకల్పపూరక; అతిసుకుమార దేహ; అకర్దమ వినోదలేపన; కోటిమన్మథాకార; రణకేళిమర్దన; విజృంభమాణ సకలలోక కుక్షింభర; సప్తకోటి మహామంత్ర తంత్రస్వరూప; భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ విధ్వంసన; శివలింగ ప్రతిష్ఠాపనకారణ; దుష్కర్మ విమోచన; దౌర్భాగ్య నాశన; జ్వరాది సకలలోపహార; భుక్తి ముక్తిదాయక; కపటనాటకసూత్రధారీ; తలావినోదాంకిత; కల్యాణపరిపూర్ణ; మంగళప్రద గానలోల; గానప్రియ; అష్టాంగయోగనిష్ణ; సకలవిద్యాపారీణ; ఆది మధ్యాంతరహిత; యజ్ఞకర్త; యజ్ఞభోక్త; షన్మతవైభవసానుభూతిచతుర; సకలలోకాతీత; విశ్వంభర; విశ్వమూర్తే; విశ్వాకార; దయాస్వరూప; దాస జన హృదయకమలవిహార; మనోవేగగమన; భావజ్ఞనిపుణ; ఋషిగణగేయ భక్తమనోరథదాయక; భక్తవత్సల; దీనపోషక; దీనమందార; సర్వస్వతంత్ర శరణాగతరక్షక; ఆర్తత్రాణపరాయణ; ఏక అసహాయ వీర; హనుమాన్; విజయీభవ; దిగ్విజయీభవ; దిగ్విజయీభవ;

శ్లో॥ అథస్తోత్రేణ సంతుష్టో - భక్త్యా నీలకృతేన చ
ఉవాచవచనం నీలం - హనుమా న్వాయునందనః

తా॥ అటుపిమ్మట నీలునిచే చేయబడిన భక్తిపూర్ణమగు స్తోత్రముచే సంతసించినవాడై వాయునందనుడగు హనుమంతుడిట్లనెను.

శ్లో అగ్రగణ్యోఽసి భక్తానాం మమ నీల సదాభవాన్
విభీషణ స్తవపితా - సఖా మమ మహామతే॥

తా॥ ఓ నీలా: నీవు నా భక్తులందరిలోను ఎల్లప్పుడు నగ్రగణ్యుండగు వాడవైతివి. ఓ బుద్ధిమంతుడా; నీతండ్రియగు విభీషణుడు కూడ నాకు మిత్రుడే

శ్లో॥ జ్ఞాతంమయాతవాభీష్టం – తద్దదామి న సంశయః
శ్వో మహేంద్రపురం గత్వా – జిత్వాతి భువనేశ్వరమ్॥

తా॥ నీ కోర్కె నెఱింగితిని. నిస్సందేహముగా దానినీయగలను. రేపు అమరావతికేగి ఇంద్రుని జయించి

శ్లో॥ చింతామణ్యాదికం దివ్య – రత్నజాత మవాప్స్యసి॥

తా॥ చింతామణి మున్నగు దివ్యరత్నములు పొందగలవు.

శ్లో॥ రూప శీల వయో భాగ్య – సహితా వసుందరీ
రత్నభూతా సురస్త్రీణాం – సాచాపి ప్రాప్స్యతే త్వయా॥

తా॥ ఇంకనూ దేవతా స్త్రీలలో రత్నమువంటి అందము. శీలము యుక్తవయస్సు సౌభాగ్యముకల వన సుందరిని కూడ పొందగలవు.

శ్లో॥ ఆగత్య తేంతికం పశ్చా – చ్చతుర్వక్త్రః పితామహః
అప్రార్థిత మభీష్టం చ – ప్రదాస్యతి మహామతే॥

తా॥ విజ్ఞుడా ఆ వెనుక పితామహుడగు బ్రహ్మదేవుడు కూడ నీ సమీపమునకు వచ్చి నీవు కోరకున్నను వరము నీయగలడు.

శ్లో॥ మద్విద్యాం ప్రజపే ద్యస్తు – మద్వ్రతం కురుతే భువి
భవా న్యథా తథైవాసౌ – సద్య స్సిద్ధి మవాప్స్యతి॥

తా॥ ఎవడైతే లోకమున నా మంత్రమును జపించి నా వ్రతము నాచరించునో అట్టివాడు నీవలె వెంటనే ఫలితమును పొందును.

శ్లో॥ పురుషోత్తమ సంస్థానం – త్వన్నామ్నా ఖ్యాతి మేష్యతి
మృగశీర్షాఖ్య నక్షత్రం –భవనం తే భవిష్యతి

తా॥ నీపేరుమీద నీ చోటికి పురుషోత్తమ క్షేత్రమని కీర్తి కల్గును. నీకు మృగశీర్షా నక్షత్రము నిలయము కాగలదు.

శ్లో॥ మమత్వం దక్షిణే భాగే - స్థితిం ప్రాప్య మహామతే
సర్వే మనోరథాః శ్రేష్ఠా - ప్రాప్యంతే మత్ప్రసాదతః

తా॥ బుద్ధిమంతుడా నీకు నా దక్షిణభాగము నీ స్థితి యేర్పడును. నా యనుగ్రహముచే నీ కన్ని గొప్ప గొప్ప కోర్కెలు నెరవేరగలవు.

శ్లో॥ ఇత్యుక్త్వా భగవద్దేవః - శ్రీరామ ప్రియ కింకరః
అంతర్దధే రుద్రగణై - స్సురర్షి భి రభీష్టదః

తా॥ భగవంతుడు దేవదేవుడు శ్రీరామునకు ప్రియ సేవకుడగు హనుమంతుడు పైరీతిగాబల్కి కోర్కెలనిడు నాతడు రుద్రగణముల తోను దేవర్షులతోను అంతర్ధానమొందెను.

శ్లో॥ విభీషణసుత శ్శ్రీమా- న్నవా ప్తసక లేప్సితః
భార్గవస్య గురోః పాదౌ - భూయోభూయః ప్రణమ్య చ
లంకా మాగత్య పితరౌ వ వందే వినయాన్వితః

తా॥ సకలాభీష్టములనందిన విభీషణసుతుడు శ్రీమంతుడగు నీలుడు గురువగు శుక్రాచార్యుని పాదములకు మరల మరల ప్రణమిల్లి లంకకు వచ్చి వినయముతో కూడినవాడై తల్లిదండ్రులకు నమస్కరించెను. సుఖముగా జీవించుచుండెను.

ఇతి శ్రీ హనుమద్వ్రతకథాయంనీలచరిత్ర కథనం
నామ తృతీయోఽధ్యాయ

శ్రీపరాశరః

అథ చతుర్థోఽధ్యాయః

శ్రీ పరాశరః -

శ్లో॥ తతో నీల శ్శౌర్యశీలః - సర్వరక్షో హితం కరః
ఫలితోరు తపోవృత్తి - ర్మన స్యేవ మతర్కయత్

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! అనంతరము శౌర్యసంపదలుకలవాడు, రాక్షసగణమునకు మేలుచేయువాడు, తపః

ఫలమందిన వాడు అగు నీలుడు మనస్సునందిట్లు ఆలోచించెను.

శ్లో॥ వితథం బలినా శ్శౌర్యం - శత్రుభీతి మకుర్వతః
కులధర్మ స్సురా న్జిత్వా కీర్త్యుత్పాదన మేవ నః॥

తా॥ శత్రువులను భయపెట్టని పరాక్రమము వ్యర్థము. మాకుల ధర్మము దేవతలను జయించి కీర్తినందుటే

శ్లో॥ విచిం త్యేత్య సురాధీశో - దండయాత్రాం వితత్య చ
దూత మేకం సమాహూయ - బభాషే పరభీకరః

తా॥ అని అసురనాయకుడు, శత్రుభీకరుడు అయిన నీలుడు తలంచి దండయాత్రకు నిశ్చయించి ఒక్క దూతను పిలిచి ఇట్లు పల్కెను.

శ్లో॥ గచ్ఛ దూతామరావాసం - మద్వాచో వద వజ్రిణో
మమ జ్యేష్ఠపితృవ్య శ్చ రావణో రణకర్కశః॥

తా॥ ఓ దూతా ! అమరావతికేగి ఇంద్రునితో నా మాటగా చెప్పుము నా పెదతండ్రియగు రావణుఁడు యుద్ధమునకఠోరుఁడు.

శ్లో॥ పురా యోద్ధుం త్వ మాహూత_స్తేన క్రోధసుసంయుతః
యువయో రభవ ద్యుద్ధం—భూరి మాయాస్త్రసాయకైః॥

తా॥ పూర్వము వానిచే యుద్ధమునకు పిలువ బడిన వాఁడవై. క్రోధమూనితివి నీవు. అప్పుడు గొప్ప మాయాస్త్రములతో మీకు యుద్ధము జరిగెను.

శ్లో॥ భవ న్త మ్మగజో వీర్యా-న్మేఘనాద స్తదా ఖలు
ఆనయ చ్చ తదా లంకాం-తతో భ్యేత్య పితామహః॥

తా॥ అప్పుడు నా సోదరుఁడగు మేఘనాధుఁడు నిన్ను లంకకుఁ గొనివచ్చెగదా। అప్పుడు బ్రహ్మ సమీపించి

శ్లో॥ విను తేంద్రదజి దిత్యాఖ్యాం-త స్మై దత్త్వా మనోరథాన్
ప్రయయా మోచయిత్వా త్వాం-వేత్తి సర్వ మిదం భవాన్॥

తా॥ ఇంద్రజిత్ అనుపేరుతో పొగిడి అతనికి అన్ని వరముల నిచ్చి నిన్ను విడిపించి వెడలెకదా! ఇదియంతయు గురుతేకదా!

శ్లో॥ తస్మాద్యోద్ధుం న తే శక్తి ర్దేహి దేవ భవాన్మమ
చింతామణ్యాదికం దివ్య-రత్నజాత మనుత్తమమ్॥

తా॥ కావున యుద్ధముచేయ నీకు శక్తి లేదు కాన నింద్రుఁడా! నీవు చింతామణి మొదలగు శ్రేష్ఠమగు దివ్య రత్నములను నాకిమ్ము

శ్లో॥ కామధేనుం చ దేహీతి-దూత స్త్రత్పహితో యయౌ

తా 'కామధేనువును కూడా నిమ్ము' అని చెప్పగా దూత వెడలెను.

శ్లో॥ అథ గత్వాఽమరావాసం-దదర్శ చ శచీపతిమ్
మహాద్రిపక్ష విచ్ఛేదన క్షమం బిభ్రతం పవిమ్॥

తా॥ అటుపిమ్మట స్వర్గపురికేగి శచీ దేవి భర్త యగు దూత దేవేంద్రుని చూచెను. అతఁడెట్టివాడనిన కొండల రెక్కలనూడ్చుటయందు సమర్థమగు వజ్రాయుధము ధరించినవాఁడు.

శ్లో॥ పులోమజాలస ద్వామ-పార్శ్వం నిర్జర సేవితమ్
గంధర్వోద్గీతం-బృహస్పతి కృతాశిషమ్॥

తా॥ శచీదేవితోఁడ ప్రకాశించు వామభాగము కల వాఁడును అనగా నెడమవైపున శచీదేవి యున్నవాఁడును దేవతలచే సేవింపబడు వాడును, గంధర్వాప్సరో గీతములచే కీర్తింపబడువాఁడును, బృహస్పతిచే నీయబడిన యాశిషములు కలవాఁడును.

శ్లో॥ పశ్యంత మప్సరో లాస్యం-భ్రాజమానం సభాంతరే
తతో నీలాసురే ణోక్తం-కథయామాస గర్వతః॥

తా॥ అతఁడు అప్సరాంగనల నృత్యము తిలకించుచు సభా మధ్యమున విరాజిల్లు చుండెను. అంతట దూత గర్వముగా నీలునిచే చెప్పబడి నది పలుకజొచ్చెను.

శ్లో॥ శ్రుత్వా దూతేరితం వాక్యం-కోపా దూచేశతక్రతుః
బల పాకాది జంభాద్యా-మ త్కరాశనినా హతాః॥

తా॥ దూతచేఁ జెప్పబడిన వాక్యమును విని దేవేంద్రుఁడు కోపముతో నిట్లుపల్కెను. ఓయీ! బలుఁడుఁ పాకాసురుఁడు, జంభాసురుడు మున్నగువాఁరు నాచేతి యందలి వజ్రాయుధముచే జంపబడిరి,

శ్లో॥ పాతాళే చ భయచ్ఛన్నాః-కేచి త్తేష్వయ మాసురః
దైత్యేషు కేన వా తుల్య-స్త్వంరఁభాతిశయోజ్వలమ్॥

తా॥ వారిలో కొందఱు రాక్షసులు పాతాళ లోకమున దాగి భయముతో నుండిరి. అట్టి రాక్షసులలో నెవరితో నాతఁడు సమానుడు? అటో పాతిశయముతో ప్రకాశించునట్టి

శ్లో॥ వజ్రం దధానం మా మత్ర-ప్రపశ్యతు పురందరమ్

తా॥ వజ్రాయుధమును ధరించిన దేవేంద్రుడనగు నన్ను యుద్ధ రంగమునజూడగలడు.

శ్లో॥ శతకోటి ప్రహారస్య-శతకోటి సూరారయః
న శక్తా స్సహనే యుద్ధే-కిదృశో మే పురోఽసురః॥

తా॥ వజ్రాయుధపు దెబ్బకు యుద్ధమున వందకోట్ల రాక్షసులకు సహించ శక్యముకాదు. ఇక నీలుడన నెట్టివాడు?

శ్లో॥ ఉక్త్వేదూతం ససంరంభ-మవాదీ త్పార్శ్వవర్తినమ్
దూతస్య హింసా నోకార్యా-త దస్య కరబంధనమ్॥

తా॥ అని సంరంభమున బల్కిన వాడై తన ప్రక్క నున్న వానితో నింద్రుడు దూతను హింసించరాదు. కావున వీని చేతులను బంధించి

శ్లో॥ కృత్వా వితనుత క్షిప్రం-శిఖాచ్ఛేద మహంకృత
శ్రుత్వా చ తే తథాచక్రు-స్స చ ఖేదం పరం గత ః॥

తా॥ వెంటనే ఈ యహంకారికి శిఖ తెగ వేసి 'వీరుడు' అనెను. అది విని వారట్లే చేసిరి. ఆ దూత మిక్కిలి దుఖించెను.

శ్లో॥ ఆతుర స్తక్షణం గత్వా-ప్రచఖ్యౌ నీలరక్షసే
సచాపి కుపితో ఘోరం-భేరీ నినద భిన్నదిక్॥

తా॥ వెంటనే ఆ క్షణమే వెళ్ళి దూత యాతురతతో నీలునితో జెప్పెను. అతండును కోపగించినవాడై భేరీ నినాదములతో దిక్కులన్నింటిని ఛేదించుచు

శ్లో॥ రధకేతూత్థ పవన-జాల క్షుభ్య న్నదీజలః
కరస్ఫురిత కౌక్షేయ-రుచిచ్ఛన్న జనేక్షణః ॥

తా॥ రథముల టెక్కెములచే నెగయు గాలులచే క్షోభచెందు నదీ జలములు కల్గి, సేన చేతులందలి కత్తుల కాంతిచే జనుల కనులగప్పు వాడై

శ్లో॥ సేనాంగ చరణాఘాత-చూర్ణీకృత గిరిస్థలః
ససైన్యః ప్రస్థల ద్దైన్యశ్శతమన్యు ముపాద్రవత్॥

తా॥ కాల్బలపు పాదఘట్టనచే పొడిపొడి చేయబడిన కొండ ప్రదేశములు కలవాడై సేనతో కూడి దీనత వీడిధైర్యముగా నింద్రుని చేరెను

శ్లో॥ గత్వా విలయకాలోత్థ-మేఘ స్తనిత భీకరమ్
అట్టహాసం చకా రోచ్చై-ర్వివ్యధు ర్ది గదీశ్వరాః
ససైన్యా స్సహసా గత్వా-పరివవ్రు ర్బలాంతకమ్॥

తా॥ ప్రళయకాల మేఘగర్జనతో సమమగు భయంకరమగు నట్టహాసము చేయ దిక్పాలకు లందరు కలతబడి వెంటనే సేనతోగూడినవారై వెడలి ఇంద్రుని చుట్టూ చేరిరి.

శ్లో॥ తైస్సమేతః స్ఫుర త్తీవ్ర-ధార వజ్ర లస త్కరః
జగా మ యోధన భువం-జిష్ణుః పార్శ్వగతామరః ॥

తా॥ వారితో కూడినవాడై, ఒప్పెడు గొప్పపదునుగల వజ్రాయుధముచే ప్రకాశించు చేయికలవాడై, దేవతలు ప్రక్కనగూడ జయశీలుడగు ఇంద్రుడు యుద్ధభూమికి వెడలెను.

శ్లో॥ అథాదితేయ దైత్యానాం-బభూ వాయోధనం మహత్
జగతాం భయదం ఘోరి-సింహనాద సమాకులమ్॥

తా॥ అటు పిమ్మట దేవతలకు రాక్షసులకు జగత్తునకు మిక్కిలి భయము కల్గించు, భీకర సింహనాదములతో కూడిన గొప్ప యుద్ధము జరిగెను.

శ్లో॥ తారాః పేతు రథక్షీణా-వార్ధయ శ్శితగు ర్భ్రిమన్
యయౌ ది క్ష్వపథా త్సూర్య-శ్చచాల చ వసుంధరా॥

తా॥ అప్పుడు నక్షత్రములు నేలబడెను. సముద్రము లింకెను. చంద్రుఁడు భ్రమసెను. సూర్యుడు మార్గము వీడి పయనించెను. భూమి సంచలించెను.

శ్లో॥ పవుర్మహానిలా నేముః-ఫణీంద్రస్య ఫణాజవాత్
ఏవం ప్రవృత్తే తుములే-సంయుగే సుర రక్షసామ్॥

తా॥ ఆదిశేషుని పడగలు వేగముతో మహావాయువుల వ్యాపింప జేసినవి. ఇట్లు దేవదానవులకు సంకుల సమర మేర్పడగా

శ్లో॥ నిర్మాయ మాయా మసురా-స్సురా న్మగ్నాని వాంబుథౌ
విధాయ మోహితా న్సర్వా-న్సింహనాదా న్ప్రిచక్రముః

తా॥ రాక్షసులు మాయను నిర్మించి దేవతలను సముద్రమున ముంచినట్లు మాయలో ముంచి వారు మాయామోహితులుకాగా సింహనాదము లొనర్చిరి.

శ్లో॥ అశక్తాః స్తాతు మమరాః-పలాయంత దిశో భయాత్
మఘవా స్వీక్ష్య సకలా-నమరా నో్క-పదీపితః॥

తా॥ నిలబడు శక్తిలేనివారై దేవతలు భయముతో నలువైపులకుఁ బరుగిడుచుఁ జొచ్చిరి. అట్టి దేవతల నందరును చూచి ఇంద్రుడు కోపముతో కూడినవాడై

శ్లో॥ ఘోరారి భేరి రవణ-మారుహ్య ధవళం గజం
ప్రత్యర్థి మర్మ దళనం-కులిశం పాణినా దధత్॥

తా॥ భయంకరమగు శత్రుభేరీ శబ్దముల విని తన తెల్లని యేనుగగు నైరావతము నెక్కినవాడై శత్రుకీలకమును భేదించగల వజ్రాయుధమును చేతఁబూని

శ్లో॥ దైత్యానాంగణ హుంకారై - రహంకారం విజృంభయన్
జంభారి రభ్యయా న్నీలం - రయద్దానవనాయకమ్॥

తా॥ రాక్షస సమూహముయొక్క హుంకారములచే నహంకారమును విజృంభింపజేయుచు వేగముగా రాక్షస నాయకుడగు నీలు నెదురొక్కెను.

శ్లో॥ అబ్రవీచ్చ సమాసాద్య — రాక్షసాధిపతిం రుషా
మ దాత్మ సంభవో వాలీ త్వ త్పితృభ్రాతరం పురా

తా॥ సమీపించినవాడై కోపముతో రాక్షసనాయకుని గూర్చి యిట్లు పల్కెను. నా కుమారుడగు వాలి పూర్వము నీ తండ్రి సోదరుడగు రావణుని

శ్లో॥ లాంగూలరోమ్ణా తం బద్ధ్వా — రావణం వారిరాశిషు
మజ్జయామాస తత్సర్వం — పితృవ్యాన్న శ్రుతం కిము॥

తా॥ తోక వెంట్రుకలచే తనే బంధించి సముద్రములందు ముంచెత్తెను. ఆ వృత్తాంతము నీ పెదతండ్రి నుండి వినలేదా?

నీల ఉవాచః-

శ్లో॥ శక్రః త్వా మగ్రహీ ద్యుద్ధే- మేఘనాధో మదగ్రజః
స్వగృహం చానయ ద్బద్వా — చేంద్రదజి ద్బిరుదాంకితః॥

